# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౧౨ | నెడ. | నెద. |
| ౨ | ౧౪ | షష్ఠ్యంత. | షష్ట్యంత. |
| ౩ | ౩ | మధ్యము. | మద్యము. |
| ,, | ౧౪ | పెదంబు. | కుచఁబు. |
| ,, | ౧౮ | దవిని. | దిపిచి. |
| ౪ | ౧ | కలఁజా. | కనరా. |
| ,, | ౨౫ | గర్దమ. | కర్దమ. |
| ,, | ౩౦ | లీఁగెడు. | వీఁగెడు. |
| ౫ | ౩౧ | దములో. | దములొ. |
| ౬ | ౧౩ | వలీన. | నపీన. |
| ,, | ౨౬ | బోండ్ల. | బోండ్లు. |
| ,, | ౩౦ | నల్లనిఁజ. | నల్లనఁజి. |
| ౭ | ౧౦ | గ్రోలు. | గ్రాలు. |
| ,, | ౧౬ | పయ్యెదలుగైవశ. | పయ్యెరలుగైవస. |
| ౮ | ౩ | గుండ. | గుంద. |
| ,, | ౧౩ | మాలలు. | మాలల. |
| ,, | ౧౬ | గడుపాటు. | గరుపాటు. |
| ,, | ౨౦ | జూచిన. | బూచిన. |
| ౧౧ | ౯ | నంతయు. | నెంతయు. |
| ,, | ౨౩ | జెల్లున. | జెల్లుగ. |
| ,, | ౨౮ | కోటలు. | కోటుల. |
| ౧౨ | ౫ | పొలతుక. | పొలఁతుల. |
| ,, | ౨౧ | తొగలి. | తొగవి. |
| ౧౩ | ౧౯ | నవీన. | విలీన. |
| ౧౯ | ౬ | రుచక. | రుచిక్ష. |
| ౧౫ | ౨౩ | ఋమున. | ఋమల. |
| ౧౬ | ౯ | చెలిమం. | చెరిమం. |
| ,, | ౨౬ | విసిరిన. | విరిసిన. |
| ౧౭ | ౧౧ | దంపలున్. | దండలన్. |
| ,, | ౪ | పటీరమున్. | పటీరముల్. |

| పుటం. | పఙ్త్కి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౫ | ౧౮ | దంబులన్. | దంబులున్. |
| ౧౯ | ౧౪ | కేళపా. | కేశపా. |
| ,, | ౧౬ | పొదలెడి. | పొదవెడి. |
| ,, | ౨౭ | దూరెంగు. | దూరెకు. |
| ౨౦ | ౭ | నొల్లలియ. | నొల్లియ. |
| ౨౨ | ౧ | కుండకు. | కుందకు. |





శ్రీ

శ్రీహయగ్రీవాయనమః

# ఋ తు వి లా స ము.

ఉ॥ శ్రీనలినాననన్ హృదయసీమను జేర్చి సమస్తలోకముల్ ।
మానుగ బొజ్జనుంచి మునిమండలచిత్తముల న్వసించుచున్ ।
బూని చరాచరాళి నుడివోనికృపన్ భరియించు నార్తర ।
క్షానిరతుండు శౌరి మము శాశ్వతసంపదలిచ్చి ప్రోచుతన్॥ ౧.

ఉ॥ ఏతలిరాకుబోఁడి భజియించెడు భక్తుల కిష్టసంపదల్ ।
బ్రీఁతిగ నిచ్చు నేయువిద బల్విడిఁగొల్వఁ గోలల్దొలంగు నెం ।
పేతరుణీలలామకృప నెంతయుఁ గల్గెడు నట్టి పద్మ స ।
చ్ఛీతలమౌ కటాక్షరుచిఁ జెంచఁగఁ జేయుత మాకభీష్టముల్॥ ౨.

ఉ॥ భావమునందలంప ననివారితవిద్యయు వాక్ప్రసిద్ధియున్ ।
జేవయు సౌఖ్యము న్సిరియు సిద్ధియు బుద్ధియుఁ గల్గఁజేసి యిం ।
పావహిలంగ నేలెడు నిరామయకాయుని శ్రీరమాహయ ।
గ్రీవుని నాదిదేవు నెడఁ గీల్కొనుభక్తి భజింతు నిచ్చలున్॥ ౩.

ఆ.వె॥ వామలూరుతనయు ద్వైపాయనుని గాళి। దాసు మాఘు బాణు దండి దలఁతు।
నన్నయాఖ్యు దిక్కనను శంభుదాసుఁబో । తన్న బెద్దనార్యు సన్నుతింతు॥ ౪.

ఉ॥ ఆర్యనుతున్ లసద్గుణమహాంబునిధానము సర్వశాస్త్రవి ।
ద్వర్యుని సాత్త్వికాత్ముని నుదారవచస్కుని శేముషీసురా ।
చార్యునిఁ గౌశికాన్వయునిఁ గర్మధురీణుని వీరరాఘవా ।
చార్యుని మద్గురున్ మదిని సంతతమున్ భజియింతు నెమ్మితోన్ ॥ ౫.

క॥ మిత్రున్ భారద్వాజ సు। గోత్రున్ ద్రాహ్యాయనైక గురుసూత్రు సుచా ।
రిత్రున్ సామామ్నాయ సు । పాత్రున్ బరవస్తుశ్రీనివాసార్యమణిన్ ॥ ౬.

మ॥ చెలికారంబున నొక్కనాఁడు హితగోష్ఠిన్ జేరి యుండంగ న
న్నలరన్నన్గొని మిత్ర నీకవితలింపారుంగదా సమ్మదం ।
బెలయంగా రచియింపు మాంధ్రమున నింపేపారు చందంబుతో ।
నలవారంగను గాళిదాసు ఋతుసంహారంబు గారంబునన్॥ ౭.

క॥ రంజనమై సంగము వ । ల్పంజక్కని లీలనేలు జనపతి యగు మృ ।
త్యుంజయ నిశ్శంకేంద్రుని । కింజవిగూర్పు మొగినీదు కృతిచే ననుచున్ ॥ ౮.

క॥ మము నించుక పేర్కొని య । క్కమలానాయకుని నిమ్ముగను గృతిపతిగా

సమరింపుము మాయెడ నే । స్తము నింపుమటన్న సమ్మదంబారంగన్ ॥
క॥ సరసగతిభావ్యకారుల । తిరువడిగళుఁ జెందిమను చుదృఢమానసుఁడై ।
పరఁగినయదణపురత్తు । ప్పెరియాళ్వారులపదవినిఁ జేర్కొనఁజన దే ॥ ౧౦
క॥ తత్తనయుఁడునిగమాంతవి । దుత్తముఁడై వాఙ్మతిస్ఫుటోరగవిభుఁడై ।
యుత్తరదిగ్జయమునస । ద్వృత్తంబునభట్టనాథదేశికుఁడొసరన్ ॥ ౧౧
క॥ పరవస్తుస్థాపనమునఁ । బరవస్తుకదిగ్గజార్యపటుబిరుదంబుల్ ।
దొరకొలుపడసిధరణిన్ । గురువైష్ణవనిచయమునకు గురులై యలరెన్ ॥ ౧౨
క॥ ఆవంశక్రమమునఘణి । దేవసముఁడుకృష్ణయార్యదేశికుఁడుయశో ।
శ్రీవఱలెఁడతత్కుమారుఁడు । శ్రీవరదార్యగురుఁడిలను జెన్నసలారెన్ ॥ ౧౩
క॥ ఆర్యస్తవనీయునకున । వార్యవచోధుర్యునకునువర నార్యునకున్ ।
శౌర్యంఘ్రిజలజసేవా । కార్యజ్ఞుఁడు శ్రీనివాసఘనగురుఁడుదగెన్ ॥ ౧౪
క॥ ఈయనఘునకునుమాకును । శ్రీయుతమృత్యుంజయాంకపృథ్వీశునకున్ ।
బాయకనన పాయకృపా । మేయుఁడయి శ్రీలిడన్ సమిద్ధమనీషన్ ॥ ౧౫

షష్ట్యంతములు.

క॥ ఓంకారశబ్దమయునకు । శంకరముఖదైవనికరసద్ధ్యేయునకున్ ।
బంకహరనికాయ్యునకున్ । శంకణశయునకును వీతకాశేయునకున్ ॥ ౧౬
క॥ హరికి నిరయోరులతికా । చ్ఛురికి సురవిరోధిమత్తశుండాలసుకే ।
సరికనతలోకముస్తాం కిరికి దయాలహరికమృతకేళీఝురికిన్ ॥ ౧౭
క॥ పరునకు మునిమానసమం । దిరునకు రక్షోవిదళననియతశరధను ।
ర్ధరునకు శుభకరునకు శ్రీ । వరునకును మస్తలోకభరణపరునకున్ ॥ ౧౮
క॥ హారిరసంబులనుజమ । త్కారమెనయుకాళిదాసకవిదగుఋతుసం ।
హారంబునాంధ్రముననవ । లారహినొనరింతుఋతువిలాసమనంగన్ ॥ ౧౯

❊ గీష్మర్తువర్ణనము. ❊

చ॥ తివిరి నిదాఘవేళయరుదెంచెనుబోఁటికరంబు వేఁడిమిన్ ।
నెవడెడివేవెలుంగుభజనీయుఁడుగాఁదగుచందమామయున్ ।
దవిలిమునుంగనింపగునుదంబునురమ్యదినాంతసంఘమున్ ।
సవసవగాశమించినయనంగుఁడు నైకడునాప్పమీఱఁగన్ ॥ ౧
చ॥ ఇరులగమిన్ హరించురజనీనునిచే మురిమించుగాత్రులున్ ।
హరువుగఁగ్రాలుచిత్రజలయంత్రములంబొలుపారుగేహముల్ ।
సరసపుఁజంద్రకాంతమణిజాలవితర్దులుగల్గి చెన్నుగన్ ।
బరఁగెనిదాఘవేళజనవారమనోజసుఖోపభోగ్యమై ॥ ౨

చ॥ అనువుగ నొప్పె గ్రీష్మసమయంబున రాత్రులు చందనాదులన్
మునుకొను మంచితావుల సమున్నతమై ఖరిమించు మేడలున్ ।
ఘనకబరీముఖానిలవికంపితమధ్యములం గజోరుదీ ।
పనమగు తంత్రిపాటలు నవంబుగఁ బ్రోడలకింపుఁ గూర్చుచున్ ॥ ౨౨.

చ॥ వలిపపుటొల్లెకట్లఁ జెలువంబగు మేఖలలన్నితంబముల్ ।
మలయజచర్చలన్వ్యష్టలమౌక్తికహారములన్ గుచంబులన్ ।
జలములనాడి యొడ్డపలుచందపుఁదావులఁ బొల్చి పెన్నెరుల్ ।
గలిగి ప్రియాళితాపములఁ గ్రన్నఁ బాపు సరోజగామినుల్ ॥ ౨౩.

చ॥ అనిశము రాగరంజితములై తగు లత్తుకలింపుఁ బెంపఁ జె ।
న్నొనరెడి నూపురప్రభల నొప్పరళించు వధూపదంబులన్ ।
మొనసెడి రాకపోకలను మ్రోయు మనోహరహంసకధ్వనుల్ ।
జనములమానసంబుల వశంబొనరించెను శంబరారికిన్ ॥ ౨౪.

ఉ॥ మంచులమించు లందొలకు మౌక్తికహారములొప్పమీఱఁగా ।
సంచితచందనద్రవసమర్పణఁ జేసి వధూపదంబులున్ ।
గాంచనమేఖలాలసితగాఢఘటంబము లింపుఁ గూర్చి వే ।
పెంచె సముత్సుకంబుఁ బృథివీజనకోటిమనోంబుజంబులన్ ॥ ౨౫.

చ॥ సవురుగ నింపుఁ గూర్చు తనుసంధుల నెల్లెడ నోలిఁ జెమ్మటల్ ।
దివిరి స్రవించుచుండ బలు లేఁకువ దట్టపువాసముల్వ్వేసన్ ।
దవిచియలంతి దొల్లియలఁ దిప్పని చన్నులమీఁదఁ గప్పిర ।
య్యవసరమందుఁ బ్రోడలగు నంబుజపత్రవిశాలలోచనల్ ॥ ౨౬.

ఉ॥ గంధపునీటఁ దొంపురులఁ గైకొని పీవనఁ బుట్టు తెమ్మెరల్ ।
సెందినహారముల్వొలయు సిబ్బెపుగుబ్బలమీఁద్ది పూఁతలున్ ।
గ్రందుగ వీణెలం బొడము కాకలిగీతరవంబులిష్ఠగున్ ।
నొక్కందినయట్టులుండు మరునుద్ధతి మేల్కొనఁ జేయనేరిచెన్ ॥ ౨౭.

ఉ॥ తెల్లనిమిద్దెటెమ్ములను దిన్ననిజవ్వనులోలి రాత్రులం ।
దల్లనఁ జొక్కి కూర్కఁగఁ దదాననముల్గనుముత్సుకంబు సం ।
ధిల్లఁగ జాబిచూచి కడుఁ దేఁకువ రేతుపలందుఁ దోఁచు జా ।
బిల్లి కరంబు సిగ్గుగొనుపీఁకను బాండురతన్వహించుచున్ ॥ ౨౮.

ఉ॥ ఇంతులఁ బాయుటన్ దలఁచు చటింగల మెంతయు మానసంబులన్ ।
బంతము మీఱ నేర్పఁగఁ బ్రవాసులసహ్యమరుత్సమాహతా ।
త్యంతపరాగపుంజములనబ్జహితోగ్రకరప్రతాపితా ।

నంతనుగన్నులెత్తికలఁజాలరిఁ కేమనఁజాలరయ్యెడన్ ॥ ౨౯

చ॥ మృగములుపెల్లుటెండలనుమిక్కిలితాపముఁజెందియెంతయున్ ।
దగగొనిచేటుపాటులనుదాలువులెండివనాంతరంబులన్ ।
బాగులుచునంజనచ్ఛవినిఁబోలిచెలంగఁగనీళులంచొగిన్ ।
గగనముఁజూచినిక్కెడుఁదగండలఁపుల్లొలిపోవుచుండఁగన్ ॥ ౩౦

చ॥ పొలుపుగసుందరోడుపవిభూషితలై చెలువొందుసంధ్యల ।
ట్లలఘువిలాసభాసురములై చిఱునవ్వులఁగూడివక్రపున్ ।
సొలపులనీనుచూపులనుసుందరులంగజదీపనంబులన్ ।
బలుపుగొనంగఁజేసిరిప్రవాసులడెందములన్ రయంబునన్ ॥ ౩౧

చ॥ ఖరకరచిత్రరశ్ములనుగ్రాఁగికరంబువిదహ్యమానపా ।
సరణినిఁదప్తరేణువులసంతతిరేచియధోముఖంబుగా ।
గిరిగొనువక్రయానములఁగేరిపొరింబుసవెట్టుగాలియ
ప్పరుసునసెమ్మిక్రిందభువిఁబ్రాకెడిసత్ఫణిభంగిఁగ్రాలెడున్ ॥ ౩౨

చ॥ ఒదవెడిదప్పిఁజేడ్పడిమహోత్కటతీవ్రపరాక్రమైకసం ।
పదసడలంగమాటికినవారణనూర్చుచునోరువిచ్చుచున్ ।
మదగజరాజిమ్రోలఁబెరిమన్ దిరుగంగనిజిహ్వయార్చుచున్ ।
బొదలుసటల్చలింపహరిపోతముమిన్నకయుండెనత్తఱిన్ ॥ ౩౩

ఉ॥ మెండుగనెండగాయుచునుమేదినితప్తముఁజేసినట్టిమా ।
ర్తాండమరీచికానిచయమంగిళులన్ గరసీకరంబులన్ ।
గండజనార్పదప్పిఁగొనికాయములొయ్యననేలవైచివే
దండములట్లుసింహములధాటికిభీతిలవింతయేనియున్ ॥ ౩౪

ఉ॥ వేలుపమందునిప్పబలువీఁకనుభానుకరప్రసారముల్ ।
సోలఁగమేనిసత్త్వములఁజయ్యనఁబాపినచోమయూరముల్ ।
వ్యాళములంతికంబుననవారణఁగ్రుమ్మరఁజంపనొల్లకన్ ।
జాలిఁగలాపచక్రములసందులఁజొన్పెడిబల్భొగంబులన్ ॥ ౩౫

చ॥ అలసెడుభద్రముస్తలనుసారినగర్దమసంచయంబులన్ ।
బొలుచుసరఃప్రదేశములమోఱలఁద్రవ్వవరాహవారముల్ ।
జలజహితప్రభూతకరజాతములేర్చిననిల్వలేకయ ।
య్యలయుదరంబులోఁజొరఁగనెత్తినచాడ్పునఁదోఁచెనయ్యెడన్ ॥ ౩౬

ఉ॥ వేఁడిమిగల్గుభానువులలీఁగెడువేవెలుఁగావినింపఁగా ।
లాడకపంకపంకిలసరోంతరనీరములొయ్యఁబానిచి ।

ట్టాడఁగనీనియెండకుభయంపడిభేకములుప్పుమాపచేఁ ।
బోఁడిమిదప్పియున్నఫణిభోగపరంపరమాటుచేరెడిన్ ॥ ౩౬.
చ॥ జలమివురంబయల్పడిపసందుగఁగ్రాఁగిలుమృణాళజాలముల్ ।
వెలికిలఁబడ్డమీనములుభీతిలికుందెడుసారసంబులున్ ।
జలముననొండునొండుఁగదనంబొనరించుమదేభయూథముల్ ।
గలిగిసరోవరాంబువులుకర్దమసాంద్రములైవిరాజిలున్ ॥ ౩౭.
ఉ॥ నీరజమిత్రవిద్యుతివినిర్గతమస్తమణిప్రభాళిచే ।
సారెఁజలించునాల్కకవసంతతిమన్వెలిగొత్తుగాలిచే ।
స్ఫారవిషాగ్నితుల్యరవిబంధురభానుచయాళిచేఁదగన్ ।
దారుచుఁజంపనొల్లమిమదంబతికుండలిభేకమండలిన్ ॥ ౩౮.
చ॥ బలుపగునీరువట్టుఁగొనిపల్మఱునీళులయుక్కలారయన్ ।
సెలవులఫేనముల్గదలఁజెందొవకెంపుఱళించునాలుకల్ ।
చలనమునొందనాస్యపుటజాలముగన్పడమోఱలెత్తిపె ।
గ్గలముగఁజూడసాగెగిరికందరనిర్గతసైరిభావళుల్ ॥ ౪౦.
చ॥ సురుచిరదావపావకవిశుష్కితబాలతృణాంకురంబులన్ ।
బరుషమరుత్కదంబకవిపాతితపక్వపలాశమండలిన్ ।
ఖరకరతీక్ష్ణరశ్ములనకాండములైనజలాశయమ్ములన్ ।
బరఁగెడుకాననలయ్యెడనభంగురసాధ్వసదాయకంబులై ॥ ౪౧.
చ॥ అవధిగఁజూర్ణపర్ణమహిజావళినూర్చుచునుండెఁబల్గులున్ ।
దవదహనాత్తభీతిమలదండపొదల్సొరఁబాఱెఁగీశముల్ ।
దివిరిజలేచ్ఛనెల్లెడలఁద్రిమ్మరియెన్గవయంబులుంద్భృశన్ ।
దవిలియవక్రకూపములదగ్గరియెన్శరభంబులత్తఱిన్ ॥ ౪౨.
ర॥ ఘోరయుప్రభూతవాతములఁబొల్పుగనెల్లెడరాజిమండుచున్ ।
సరసజపాత్రసూనవిలసద్రుచిఁజెందిరపున్విలాసమున్ ।
దొరసిసమీపభూజములఁదోరపుఁగొమ్మలనెక్కినిక్కని ।
బ్బరముగఁగాల్పఁజొచ్చెవనవహ్నిదెసల్గలయంగఁబ్రాఁకుచున్ ॥ ౪౩.
చ॥ కరువలిపెంపుఁజేయగిరికందరసీమలయందుఁదోఁచుచున్ ।
సరవిఁదృణావనీస్థలులఁజక్కటిఁబాయకదోఁగియాడుచున్ ।
గెరలిచిటాపొటధ్వనులఁగీచకకాననపఙ్క్తిఁబాడుచున్ ।
దరమెమెకంబులన్వనులదారుణబాఱదవాగ్నిపెల్చనన్ ॥ ౪౪.
ఉ॥ బూరుగుచెట్టులందొలుతఁబుట్టియనేకవిధంబులొప్పఁగా ।

భూరుహకోటరంబులను బొల్చి హిరణ్యరుచిం జెలంగుచున్ ।
జేరిచి పండుటాకు గనిఁ జెంపగు సాలము లెక్కి గాలితో ।
సారెకు సంచరించె వనిజంటమొగంబుల సామియామునన్ ॥ ౪౫.

చ॥ కరికిరి కేసరి ప్రముఖ కాననజంతువితానముల్వనిన్ ।
గరకరనగ్ని మేనులను గాల్పఁగ సైపక వైరమేదియున్ ।
లరితన మారఁ బర్వతబిలమ్ముల మెట్టు బయళ్ళులన్నదీ
పరిసర సైకతస్థలులఁ బాయక చేరి వసించెఁ జెల్మితోన్ ॥ ౪౬.

చ॥ కమలవనీచితాంబువులు కమ్మనితావులనొప్పు పాదిరుల్ ।
విమలజలాభిషేకములు వేడుకఁ గూర్చెడు చంద్రికావళుల్ ।
గొమరగు సౌధముల్వలయు కొమ్మలసోయగమైన గానముల్ ।
గ్రమత నిదాఘవేళ నిడెఁ గామసముద్గమముల్ జనాళికిన్ ॥ ౪౭.

## వర్షర్తు వర్ణనము.

ఉ॥ శీకరపాళిఁ గూడికొని చెల్వగు మబ్బు మదేభమై తటి ।
ల్లోకము కేతనంబయి విలోలఘనార్భటి సన్మృదంగమై ।
జోకఘనాఘనంబు సొగసుల్నిగుడం జను దెంచె గాముకా ।
నీకహితంబుగాఁగ నవనీపతిలీలసమున్నతధ్వనిన్ ॥ ౪౮.

చ॥ లలితవినీలకైరవదళంబుల కాంతుల నొక్కచోటు పెం ।
పలరెడు కజ్జలచ్ఛవులయందము నూపుచు నొక్కచోటు వీఁ ।
కలుగల వేఁకటించు బొదలు కాంతలచన్నొనలట్టు లొక్కచో ।
టలవడ నింగి నెల్లెడల నంబుదమండము గంధుమీఱెనున్ ॥ ౪౯.

ఉ॥ పెల్లుగ నీరువట్టుగొని బిమ్మటి నొందిన చాతకాళి అం ।
పిల్లుచుఁ గోరుకోర్కెలకు మించ బరువ్వెస నుబ్బఁ దావిమాం ।
ద్యోల్లసితంబులై వెలయు నొక్కట శంబరధారలెల్లెడన్ ।
గొల్లగ నించె నంబుధరకోటి మనోహరగర్జలొప్పఁగన్ ॥ ౫౦.

చ॥ నలినసుఖమ్ములన్ మిత్పటహనాదము గాఁగ నదింద్రచాపము ।
త్యలఘుశరాసనంబుగ సమంచిత చంచలబల్లిణంబు గా ।
బలువిడి జారుధారలొగి బాణకదంబము గా వియోగిహృ ।
జ్జలజములం గలంచెను బ్రచండఘనాఘనజాలమయ్యెడన్ ॥ ౫౧.

ఉ॥ క్రొత్తగ మోసులెత్తుచును గోమలమైన తృణాళినీలర ।
త్నోత్తమకందళప్రభల నొప్పఁగ మెండగు నింద్రగోపముల్ ।
హత్తిన కెంపులట్లు జరనందములో మణిభూషలుంచు మేల్ ।
బిత్తరివోలెఁ గ్రాలె పృథివీస్థలి మానవనేత్రపర్వమై ॥ ౫౨.

ఉ॥ ఇంపొదఁగూర్చుచుంబలుకునిచ్చలనిచ్చలునుత్సుకంబుతోఁ ।
సొంపుగశోభిలంబురులువిప్పగవిచ్చుచుసంభ్రమంబుచేఁ ।
గంపిలుకౌఁగిలింతలునుగాటపుఁజుంబనలీలలొప్పనా ।
ట్యంపువిలాసముల్ నెఱపెనయ్యెడఁగేకులమూఁకలుమ్మడిన్ ॥ ౫౩.

ఉ॥ చెంగటనున్నభూజములఁజేద్పడఁగూల్చుచునిర్మలత్వమే ।
భంగినిగాననీకజడభావముతోలఘువృత్తిదుష్టలౌ ।
నంగనలట్లువిభ్రమములారనదీనివహంబులేగెబల్ ।
భంగములొందినైల్యమునభాసిలుసాగరసంగవాంఛలన్ ॥ ౫౪.

చ॥ హరిణకిశోరకక్షుతులనగ్రవిహీనములైమనోజ్ఞ తౌ ।
భరితములైనవాంకురవిభాసములైతృణజాలముల్లలిం ।
బెరిగినకాననంబులునవీనకిసాలయభూషితంబులౌ ।
తరునికురుంబకంబులనితాంతమెసంగెవిచిత్రవైఖరిన్ ॥ ౫౫.

చ॥ విలసితచాపలోత్పలనలీనవిలాసములంగనంగవల్ ।
దొలఁకుచునుండముందువెనుదోఁచకజంకుచుఁగొంకుచున్మృగా।
వలివనసీమలందిసుమవాటినచోటులనల్లిబిల్లిగన్ ।
మెలఁగఁగసాగెఁజాపరకునెమ్మియునుత్సుకముల్లసిల్లఁగన్ ॥ ౫౬.

చ॥ ఘనమగునంధకారమొగిఁగార్కొనికన్నులఁగప్పరాత్రులన్ ।
ఘనచయగర్జనంబులకుఁగంపిలిసాధ్వసమొందకన్ జళు ।
క్కనిమెఱుపప్పుడప్పుడెనయంగనువెల్గుఘటింపనేగిరి ।
చ్చనుపమరాగలైనయభిసారికలస్థవిటాలియొద్దకున్॥ ౫౭.

చ॥ పెలుకురఁజేయుపెన్నలివుపిండులుమెండుగరాల్చుమబ్బులన్ ।
మిలమిలఁగన్నుమూఁతలిడుమించులచేజళుకొందియప్డుచెం।
తలగలసాపశాఖులగునాథుఁసెజ్జలనత్తమిల్లికాఁ ।
గిలులనుపీడకుండఁదమకించిరమించిరిసారెఁగోపనల్॥ ౫౮.

చ॥ కలువలవంటికన్నులనుగ్రన్ననఁగారెడినీటిబిందువుల్ ।
గొలుకులదారివాతెఱచిగుళ్లపయింబడిపాఱుచుండఁగా ।
జెలువురుదూరమేగగృహసీమలనున్నమెఱుంగుఁబోఁడ్లసా ।
మ్ములుఁజవుసోగులున్వలపుఁబూఁతలుడాల్పరువోనిరాశలన్ ॥ ౫౯.

ఉ॥ తెల్లనికీటమ్రజముతీరునఁగ్రొవ్వఁదృణాళినిండఁగా ।
నల్లనిఁజల్వలట్టులనయంబునువక్రగతింజెలంగుచున్ ।
జల్లనసుల్లముల్గిలఁచుసందడిఁగప్పలమ్రోలఁదోఁచుచున్ ।

బల్లపుటోలముల్గడచి పాఱెను సారెకు వారిపూరముల్ ॥ ౬౦
చ॥ సరవిని రేకులూడ్చి జలజాతములుండఁగ వానిపైఁ దమిన్ ।
దొరఁగి విసంగ నింపయిన తోరపు ఝుంకృతి నిస్వనంబులన్ ।
బరిగొని మూఢతన్ సమద బంభర జాలము జుట్టుపుల్గుపిం ।
డొరపుగ నాడ బర్హములనుత్పలజాలములంచు వ్రాలెడిన్ ॥ ౬౧
చ॥ అటవిగజంబులొక్కటమ దాలసలీలల మాటిమాటికు ।
త్కటముగ వారివాహముల గర్జనలట్టుల ఘీంకరించుచున్ ।
గటములనున్న భృంగములు గైరవమాలికలట్లు గ్రాలఁగా ।
జొటజొటజాఱు సామములను సొంపుగఁ ద్రిమ్మర సాగెనెల్లెడన్ ॥ ౬౨
చ॥ సితకుముదంబులట్లడరు జీవనదంబులఁ గ్రోలు నెత్తముల్ ।
సతతము నెల్లచోటులను జాల్కొను బ్రస్రవకాంబుపూరముల్ ।
స్తుతగతి లాస్యలీలలను సొంపులు నింపెడు నీలకంఠముల్ ।
వితతముగాఁ జెలంగు పృథివీధరముల్గడుఁ జూడనొప్పెడున్ ॥ ౬౩.
చ॥ కడుకొని ప్రాచిమేచిబలు కాముకపాళికి నింపు నింపునా ।
కడుములవేఁగులన్ వలపు గ్రమ్మెడి గేదఁగి చెట్లమద్దులన్ ।
విడువక తోఁచు వాసనలు వెగ్గలపుంజడితోఁ జెనంగఁ గాఁ ।
గడఁకను వీఁచు పయ్యెదలు గైవశమెవ్వనిఁ జేయకుండునే ॥ ౬౪.
చ॥ విరిసి పిఱుంద పులానఁగను బెంపుగ గ్రమ్మశిరోజపాళితోఁ ।
బరిమళమంజుల ప్రసవభాసుర మాళితటాలితోడ బల్ ।
సరులను మించు గుత్తమగు చన్నులతోడను మద్యవాసనా ।
కరముఖపఙ్క్తి తోరతులఁ గాముక కోటిని దన్పి రంగనల్ ॥ ౬౫.
చ॥ పొలుపగు నింద్రచాపముల భూషలు గాఁ గొని గ్రొమ్మెఱుంగులన్ ।
జలములనిండఁ బూనికడు జానగు చుండు పయోదమాలికల్ ।
లలిమణిమేఖలాదిక కలాపములందివధూకదంబమున్ ।
హాళహాళి చేఁ బ్రవాసులమనోంబుజముల్విదళించెన త్తఱిన్ ॥ ౬౬.
చ॥ అకుటిలవాసనా విలసనాతిశయంబులఁ బొల్చు కేతకీ ।
వకుళ కదంబ మాలికలు వన్నెలుమీఱెడి కొప్పులందుఁ బా ।
యక చెవులందు నర్జునసుమావళిమక్కువఁ దాల్చి ప్రౌఢనా ।
యికలపుడింపుఁ గూర్చిరి రహిన్ నిజనాయకకల్పకంబులై ॥ ౬౭.
చ॥ పరువపుఁ బూవుదావులను భానిలు పెన్నెరులొంజమేచకా ।
గురుమిళితంపు గంధముల గొమ్ములమించెడి యంగవల్లులున్ ।

గరగరిమీఱ మబ్బులు మఱఁగా మునిమాపులఁ జిత్రమే మొహో ।
యిరిజతనంబు మైఁబడకటిండ్లను జేరనవోథలోక్కటక్ ॥ ౧౮.

చ॥ పతులవియోగ మోరువక పాంథులమానినులిండ్లఁ గుండఁద ।
న్మతులహరించు నగ్లుగను మంజులకైరవనీలకాంతిచే ।
వితతముగాఁగ వేల్పుదొరవిల్లెనయించిదివిక్ శరంబులు ।
న్నతగతిఁ దాల్చి పయ్యెరలనన్నుఁ గ్రుమ్మరె మబ్బులోక్కటక్ ॥ ౧౯.

చ॥ నవజలధారదోఁగినవనమ్ములు తాపములాఱినంతనిం ।
పవగతమౌవితంబున నయంబుగఁ బూచెఁగదంబభూజముల్ ।
దవిలిచరించుగాలిఁ బ్రమదంబున నర్తనమాడెఁ గొమ్మలుక్ ।
నవుదులకింపుచందమున నవ్యసుమంబులఁ గ్రాలెఁ గేతకుల్ ॥ ౨౦.

చ॥ విరిసినక్రొత్తపూవులను బెంపుగఁ గ్రాలె నెమొల్ల మొగ్గలక్ ।
గెరలుకదంబపుష్పములఁ గీలొనిమించెడు కర్ణపూరముత్ ।
పరిమళమాలతీవకుళభాసురమాలలు బల్మిరంబులుక్ ।
బెరయఁగఁ జేసెఁ జేడెలకుఁ బ్రేముడి నల్లనిమబ్బులొయ్యనక్ ॥ ౨౧.

చ॥ పొలుపుగ శ్రోణిబింబములు నూయదుకూలములంధరించి గు ।
బ్బలపయి హారవల్లికలఁ బాగుగఁ జేరిచి కాఱుమబ్బులం ।
జిలికెడునీటిబిందువులు జిట్టున మైగడు పాటుఁ గూర్పఁగా ।
లలితవళుల్ సైలంగు నవలగ్నములం జెలువొందిరంగనల్ ॥ ౨౨.

చ॥ జడిచినుకుల్ వడింబడఁగఁ జల్లఁదనంబుఁ గడించి చాలఁగా ।
నొడికపులాసకంబులను నోలిగఁ జూచిన పూపుఁ దావులక్ ।
గడఁకను దాల్చి గేసఁగులకమ్మని పుప్పొడు లేచి రేఁచుచుక్ ।
బొడవడఁగింపఁ బూనెఁ గడుఁ బ్రోషితభర్తృకలక్ సమీరముల్ ॥ ౨౩.

చ॥ పరుసనివెట్టకాఱునకుఁ జాదపజాలము దావపావకో ।
త్కరముహరింపఁ దాపమునఁ గ్రాఁగి కరంబుఁ గృశించు వింధ్యముక్ ।
బరిగొని వానమబ్బుజలధారము చేఁ బొరి నాశ్రయించియా ।
దరగతిఁ బాధ్యమిచ్చి యుపతాపమడంచి ముదంబుఁ గూరిచెక్ ॥ ౨౪.

చ॥ అనుపమసద్గుణంబులకు నాలయమై కమణీమనోజ్ఞమై ।
వనతరువల్లికానికరబాంధవమై యవికారమైనయా ।
వనధరవేళఁ బ్రాణులకుఁ బ్రాణపదంబయి సర్వలోకముక్ ।
మనుచు మనోరథంబుల సమానముగా ఫలియింపఁ జేయుచుక్ ॥ ౨౫.

## ❊ శరదృతువర్ణనము. ❊

చ॥ అతులితకాశధౌతపటయై వికచాంబుజరమ్యవక్త్రియై ।
వితతమరాళజాలరవవిశ్రుతనూపురనాదయై సమా ।
నతపరిపక్వశాలిచయనవ్యమనోహరగాత్రయష్టియై ।
క్షితినిశరత్తు చొప్పడియెఁ జేడియచందము సందడిల్లఁగన్ ॥ ౭౬.

చ॥ విరిసినరెల్లుచేఁ బుడమి వెల్లనిచేతులతేనిచేత రేల్ ।
చెఱువులు నేళ్ళ నంచగుమిచేఁ గుముదంబులచే సరస్సులున్ ।
బరువగుపూవుగుత్తులను వ్రాలిన యంటులచే వనంబులున్ ।
బోరిఁదగె మాలతీలతలపొందులచేఁ దెలిపువ్వుఁదోఁటలున్ ॥ ౭౭.

ఉ॥ మొల్లపుమీలపిండులు సముల్లసదశ్మసుమేఖలాళిగా ।
నల్లనచారుదీఱు కలహంసలమూఁకలు హారపాళిగాఁ ।
వెల్లుగనిండు బల్పులినవీధులు శ్రోణిచయంబుగా నదుల్ ।
మెల్లఁగ నేగ సాగె మురిమించెడు మత్తుఁబిత్తగుబ్బలెన్ ॥ ౭౮.

చ॥ దరరజతాబ్జకాశరుచితారొక్కను తెల్లనిచాయ మించి శం ।
బరరహితంబులై విరళభావముఁ గైకొని నూర్లువేలునై ।
యరయఁగ నాచుగాలిన సియాడెడు మబ్బులమిన్ను వొల్చెసీ ।
విరులు సెలంగ నేగు పృథివీపతికై వడి మోదకారియై ॥ ౭౯.

ఉ॥ కాటుక కప్పుచొప్పులను గారొక్కనియొప్పె నభంబు సొంపుగన్ ।
మేటిజపాసుమావళులమించెను ధారుణిశోణకాంతులన్ ।
నేటుగఁ దామరల్పెరసి నెక్కొనె నెంతయు వప్రభూములన్ ।
మీఱె మరుండు నారియువమేచకకుంతలలల్క సెందఁగన్ ॥ ౮౦

చ॥ సరసపుఁబల్లవాగ్రములఁ జాలఁగ మించెను బుప్పమంజరుల్ ।
గరువలిగండుమీఱి కడఁకన్ గదలించెను చెట్లకొమ్మలన్ ।
గెరలిమరందమద్యములఁ గేరెను వెగ్గలమైనఁ దుమ్మెదల్ ।
వరయువకోటి డెందముల వ్రయ్యలు నేసెను గోపి దారముల్ ॥ ౮౧.

చ॥ తొలుపుఁగ జారకాగణవిభూషణముల్ధరియించి నెమ్మితో ।
జలదమహావరోధములసందులఁ జందురుమోముఁ జూపుచున్ ।
వలిపెపుఁ జేటవెన్నెలలవల్వ ధరించిని శావధూటి పెం
పులఁ దులకించు బాలికను బోలెను మాటికి నింపుఁ గూర్చెడున్ । ౮౨.

చ॥ రహిఁ గారండవచంచుఘట్టనములన్ రంపిల్లుబల్వీచులన్ ।
బహుహంసాదికపక్షిసంఘములవేర్పాటొందుతీరావనిన్ ।
ముహురాకర్ణితమాననాకవిరుతామోదధ్వనిన్ సమ్మదా ।

వహనంబై యెఱదమ్మిపుప్పొడులతోఁ బాఱెన్ నదీసంఘముల్ ॥ ౧౩.
చ॥ కనుఁగవకింపుగా మదికిఁ గాదిలిగాఁ జెలువారు వెన్నెలల్ ।
మునుకొని సీతువుం గొలిపి మున్నరమైతగు మంచువానలున్ ।
దనరు వియోగవేదనలఁ బారిన నారులమేనులందు జి
చ్చెనయఁగఁ బెట్టినట్టుగను నంతయు వేఁడిమిఁ గూర్చెనయ్యెడన్ ॥ ౧౪.
ఉ॥ పంటను బర్వుచేను లఱఁగ వ్రాలిన పైరులు గంపమొందనా ।
క్కంటను బుప్పభారమునఁ గ్రన్నన వంగిన చెట్టులూఁగఁ బల్ ।
దంటతనమ్మునన్ని యయి తామరలాఁకుల మందయౌవనుల్ ।
వెంటనె కుందమిక్కిలిగ వీవఁగఁ జొచ్చెను జల్లగాడుపుల్ ॥ ౧౫.
చ॥ తఱుచగు మత్తహత్తుకముదంబున నంతట హంసదంపతుల్ ।
గొఱలఁగ నచ్చుగ న్విరిసి కోకనదమ్ములు దమ్ములొప్పఁగా ।
నటిమటి వేఁగుఁబోకఁ బవనాహతమై తరగల్చలింపఁగా ।
మఱులొడగూరి చెన్సరసిమండలి లోకమనోభిరామమై ॥ ౧౬.
చ॥ కనఁబడదయ్యె నింగిఁ దెఱగంటి వజీరుని విల్లు మబ్బులన్ ।
మినమిన మించదయ్యెఁ గుఱుమించును నంచలగుంపు లాకసం ।
బున నిజపక్షవాతములఁ బోవఁగ నింతయుఁ బూనవయ్యెనో ।
పినగతి జుట్టుపుల్గులు దివిన్ గనగుత్తుకలెత్తవేమియున్ ॥ ౧౭.
చ॥ మదమున నాడు కేకులసమంచితలాస్యము నిల్పఁ బంచియ ।
య్యదనమరుండు హంసనిచయంబుల గానము మెచ్చె నెంతయున్ ।
బొదలు కదంబనీపముఖభూరుహజాతము పీడి పుష్పసం ।
పదకయి సేసె నవ్విషమపర్ణతరువ్రజముం బెడంగుగన్ ॥ ౧౮.
ఉ॥ ఎల్లెడ నల్లవావిలులహీనసుగంధము లీనుచుండఁగాఁ ।
జెల్లునఁ గొమ్మలన్నిలచిపిట్టలు నెట్టనఁ గూయుచుండఁగా ।
మొల్లపు లేళ్లకన్నులొగి ముద్దుగఁ గల్వలసొంపు నింపఁగాఁ ।
బల్లవకోటి డెందములఁ బాయక మోదము నించెడిన్వచుల్ ॥ ౧౯.
ఉ॥ చెంబొవలన్సరోజములఁ జెందుచు సారెకు వానితావులం ।
బొందితనీయశైత్యమును బొంపిరివోవక తాల్చి తచ్ఛదా ।
స్పందహిమాంబుబిందువుల సారెఁగ దల్చుచు వేఁగుఁబోకలన్ ।
మందమరుత్కదంబములు మానవకోటులకింపుగూర్చెడున్ ॥ ౨౦.
చ॥ పరిణతశాలిపాళికలభాసిలె నెల్లెడ భూమిభాగముల్ ।
గరముఁ బశుప్రకాండములఁ గ్రాలెను బల్లెలగోష్ఠపాళిచె ।

గ్గురులునునంచలుంబలుకుగోటులమించెసరోవరంబులున్ ।
గురుకొనుపచ్చిపచ్చికలగోమునమించెనుమెట్టనేలలున్ ॥ ౬౧.
చ॥ లలనలమెల్లనైననడలన్మెచవెంగలహంసలుమ్మడిన్ ।
చెలువలమోముచందురులచెన్నుగడించెనుదెల్లదామరల్ ।
నెలఁతలచూపునిగ్గులనునిచ్చలెసంగెనునల్లగల్వల ।
పొలతుకకన్నుబొమ్మలనుబోలెనుసన్నవలౌతరంగముల్ ॥ ౬౨.
చ॥ అతివలమేలిసొమ్ములనయమ్ముగఁజూపడుబాహువల్లుల ।
ల్లితులితమైనపచ్చచిగురాకులమొగ్గలతీవెలొప్పెడిన్ ।
జతురతనవ్వుచోరదనసౌష్ఠవముంబలెనొప్పమీతెమా ।
లతులునశోకముల్పటువిలాసముఁజూపెడుమొగ్గనిగ్గులన్ ॥ ౬౩.
చ॥ రమణులుదాల్తురోజరుచిరంబులువక్రములౌశిరోరుహా ।
గ్రములనుగీలుగంటులనుగమ్మనితావులజాజిదండలన్ ।
కొమరగుకాంతిఁగుల్కుఘనకుండలమండితమైనకర్ణదే ।
శములనుసామువిచ్చిపెలుచన్వలపుల్దులకించుకల్వలన్ ॥ ౬౪.
చ॥ మలయజపంకసమ్మిళితమంజులహారములంగుచాగ్రముల్ ।
జలురతనాలచేనలరుబంగరుకాంచికలన్నితంబముల్ ।
గలరవముల్సెలంగుచుగ్రాలెడునందెలఁబాదపద్మముల్ ।
గలిగిముదంబుఁగూర్తురొగిఁగామినులత్తఱిఁగామకాళికిన్ ॥ ౬౫.
చ॥ మొగులెటఁదోఁపమింబసలఁబొల్చుచునిర్మలనీరకాంతులన్ ।
గగనముఋతుచంద్రములుగ్రాలఁగనెంతయుఁజూడనొప్పెబల్ ।
తొగలిరులంజలింపకయతోఁచెడుహంసనుగూడిపచ్చఱా ।
సొగసులనేలునీళులనుశోభిలునట్టికొలంకుకైవడిన్ ॥ ౬౬.
చ॥ శరదృతువొప్పెఁగైరవవిసారవినిర్మలవారిసీతమా ।
తరివిగతాంబుదోత్కగపిధానదిశావలిపక్వశాలివి ।
స్ఫురితధరాగ్రభాగమునుసుందరకోకనదాప్తకాంతిభా ।
స్వరతమితారకానికరబంధురచిత్రనభోంతరంబునై ॥ ౬౭.
చ॥ కెరలియహర్మ్యఖంబులమొగిందినవాథకరప్రభిన్నమై ।
గరితలనిగ్గుమోములతెగంబలెవిచ్చెనుదమ్ములోలినం
బురుహవిరోధిలీనమయిపోవఁగఁబ్రోషితభర్తృకాంగనా ।
వరహాసనంబుభంగిఁగలువల్మొగిడెన్వెసతోఁదమంతటన్ ॥ ౬౮.
చ॥ కలువలమ్రోలఁజూచితమకాంతలకన్నులటంచురాజహం ।

సలలోదలాలకించితమదానలయం దెలచప్పడంచుఁజె ।
న్నలరెడిదాసనంబునునిజాంగనవా తెఱయంచునెంతుర ।
న్నెలఁతలఁజూసిదూరధరణీ-బథికుల్వెసభ్రాంతచిత్తులై ॥ ౯౯.

చ॥ చలువలతేనిసంపదనుజక్కనిమోమునఁబూని మేటియం ।
చలగొనబైనపల్కులవెసన్ గట్టకంబులఁబూనిసజ్జపా ।
లలితవిలాసమింపుగఁజెలంగెడి మోవినిబూనియేగఁదా ।
య్యలితలమిన్న యోర్తుశరదాగమవైభవమేర్పరింపుచున్ ॥ ౧౦౦.

చ॥ వికసితనీరజాస్యయనుఁస్ఫురితోత్పలభాసురాక్షియున్ ।
వికచమనోజ్ఞకాశరుచివిభ్రమితామలచేలయుంబ్రఫు ।
ల్లకుముదకాంతిపుంజసువిలాసయనాతరుణీవతంసమ ।
ట్లకుటిలలీలనొప్పుశరదాగమమింపెనయింపకుండునే ॥ ౧౦౧.

## హేమంతర్తువర్ణనము.

చ॥ కొమరగులేఁజిగుళ్ళగమిగోమగఁగ్రొవ్విరులల్లసిల్లఁబెం ।
పమరఁగలొద్దుగల్విరిసెనంతటఁబక్వములయ్యెశాలులున్ ।
గ్రమతఁదుషారసంహతినిగంజములొప్పెనవీనశోభలన్ ।
హిమసమయాగమంబెసఁగనెవ్వనికింపుఘటింపదిద్ధరన్ ॥ ౧౦౨.

చ॥ కుదురగుగుబ్బచన్నులనుగుంకుమపంకిలచందనంబులన్ ।
బొదలనలందిప్రోడలగుముద్దులగుమ్మలుమంచుమించులన్ ।
గమరుచుఁగుందబృందములక్రొచ్చులమించెడుహారవల్లికల్ ।
పదిలముగాఁగఁదాల్చిరెదలన్ గొనబుల్వెదచల్లుచుండఁగన్ ॥ ౧౦౩.

చ॥ పొలుపగుబాహుమూలములఁబొన్పరుసందిటిదండలుబ్బుమైఁ ।
దలరెడుగబ్బిగుబ్బలనుతాల్పరుసన్నపుటొల్లెపయ్యెదల్ ।
బలుపగుశ్రోణిబింబములపైఁదమిఁగట్టరలంతిపుట్టముల్ ।
వలిబలమేమిచెప్పనగువారిజలోచనలొయ్యనయ్యెడన్ ॥ ౧౦౪.

ఉ॥ పంబినమానికంబులనుబంగరులంగనుసొంపుగూర్చుచున్ ।
డంబగుమేఖలల్కటితటంబులఁగ్రాలవుశోణనీరజా ।
డంబరలీలలన్ జివురుడాలులనేలుపదంబులందుఠా ।
వంబులనొప్పునందియలుపాటిగఁజెందవుబాలికాలికిన్ ॥ ౧౦౫.

చ॥ సురతమహోత్సవంబులనుసుందరులొయ్యననాయకాలికిన్ ।
మురిపముఁజెంపఁదావులనుమోదమునించెడుపూఁతమేనులన్ ।
గరగరనైనచెక్కులనుగాటపుఁబత్రవిలేఖనమ్ములున్ ।

గురులనుమేలిఘాసములుగూరుతురయ్యదనంబొసంగఁగన్ ॥ ౧౦౬
చ॥ మసకపుఁగఁతురంతులశ్రమంబునఁబాండిమఁజెందుమోములన్ ।
బొసఁగెడుసంతసంబువెలిపుచ్చెడుచూపులుమందమందహా ।
హాసనరుచుల్సెలంగుచునునన్నువపల్కనకాట్లతోడికెం ।
పెసఁగెడివాతెఱల్గలిగియుందురిభాస్యలువాల్చిరత్తఱిన్ ॥ ౧౦౭
చ॥ గురుతరమైనగబ్బిచనుగుబ్బలమాటికినొత్తనొర్వమిన్ ।
బరువవుశీతకాలమునుభామినియామినియేగవేకువన్ ।
బొరిఁదొరఁగించునశ్రులనఁబొల్పుగధారుణిచూడనొప్పెన ।
గ్గరుకులయంకురంబులనుగ్రన్ననఁజిందుహిమాంబుబిందువుల్ ॥ ౧౦౮
చ॥ పొదలఁగఁబూఁచికన్నులకుమోదమునించెడుశాలిమంజరుల్ ।
పదుపులుగూడియెల్లెడలబల్విడిగ్రుమ్మరుతెల్లబారులున్ ।
మదమునసారెసారెకునినాదమొనర్చెడుకొంచకూటువుల్ ।
మదులకునింపుబెంపఁగసమంచితలీలలసీమలొప్పెడిన్ ॥ ౧౦౯
చ॥ విరిసినకల్వకొల్విరులువింతలుదొంతరిలంగఁజేయఁగా ।
గరువపుటంచపిండుతెసకంబునఁబుట్టువలంకరింపఁగా ।
గరమునసంతమైగరువుగ్రమ్మెడిబత్తెలిసీరెసంగఁగా ।
సరసులుచెన్నుమీఱెజనజాతముచిత్తముఁజూఱగొంచొగిన్ ॥ ౧౧౦
చ॥ గరితరొమంచుపెంజలినిగచ్చెడలంబరిపాకమొందియున్ ।
గరుపులుగూర్చుచల్లనగుగాడ్పులఁగంపమునొందియీయెడన్ ।
బరువడిమైఁబ్రియంగులతపాండుతఁగాంచెవియోగవేదనా ।
విరసమునన్లతాంగికడువెల్లదనంబుననొప్పకైవడిన్ ॥ ౧౧౧
చ। సరససుమాసవావళిఁబసౌరభముల్జనియించుమోములన్ ।
బరువడిఁబుచ్చునూర్పులసువాసనలంగములందుఁబర్వనాం ।
డొరువులమేనులొక్కటిగనొప్పఁగదంపతులొయ్యనిద్రలన్ ।
బరగిరిగాముకేళులనుబల్విడిఁజొక్కివిచేష్టితాంగులై ॥ ౧౧౨
చ॥ అలఘురతోపయోగసమయంబుననిర్దయబుద్ధియౌవనుం ।
డలరిసనంగనారుణరదాంశుకమందునఁబంటికాటులన్ ।
వలుదలువట్రువల్సెబగువన్నెలుదొల్కుకుచాంచలంబులన్ ।
జెలుచనిగోటిపోటులనుబెల్లుగఁదోచెనుగెంపుసొంపులన్ ॥ ౧౧౩
ఉ॥ అండజయానయొర్తుకశయంబుననద్దముఁబూనిమించువే ।
మెంతఁబ్రభాతవేళమొగమింపుమెయిన్గనుగొవిరాళిమై ।

మెండగువేడ్కఁజెల్వుఁడుతమిన్జవియానితో అంగఁదోఁచుబల్ ।
పండులకాటులంగనిత్రపన్మలఁచెన్బెదఃత్రయంబునన్॥ ౧౧౪.

ఉ॥ జవ్వనియోర్తుగుబ్బమరుసామునగోమగుమేనుచొక్కఁగా ।
మవ్వములూరజాగరసమంచితపాటలనేత్రపద్మయై ।
పువ్వులదండలుంగురులుపొల్పుగజాతిసదంససీమపై ।
నివ్వటిలంబ్రభాతనలినీప్రియచారుకరప్రతప్తయై॥ ౧౧౫.

చ॥ ఘనతరనీలరత్నరుచకప్రమశిరోరుహపాళిచిక్కులన్ ।
బెనఁగొనవాడుపూసరులువెగ్గలపున్వలపుల్లడింపఁగాఁ ।
బనుపడగబ్బిగుబ్బచనుబంతులవ్రేఁగుననానతాంగియా ।
వనితకుఁగొప్పదిద్దెనొకపాటలగంధిబెడంగుమీఱఁగన్॥ ౧౧౬.

చ॥ తనుపెనయంబ్రియుండువిడఁదన్వియొకర్తునిజాంగవల్లికన్ ।
గనుఁగొనిసంతసంబుననఖక్ష్మనిమోవివిడెంపురంగుచే ।
జనుఁగవశైకచేసరభసంబునఁగప్పెక్షతవ్రణంబులన్ ।
గనఁబడకుండఁజేసెనలకల్దిగఁజాఱఁగఁగుంచితాక్షియై॥ ౧౧౭.

ఉ॥ అంగనయోర్తునవ్యసురతాంతమునన్శ్రమవారిగాత్రపున్ ।
రంగఱఁజేయుసోలుమదఁద్వరణాదనువల్లియఁజన్నులుంగను ।
ర్వంగదుఁగౌతుకంబుననభంగురమైనయొయ్యారమొప్పన ।
భ్యంగనమాచరించెసుషమాప్తికినైబలుశీటసీభ్రుఁన్॥ ౧౧౮.

ఉ॥ పెక్కుగొనంబులన్మదముపెంచుచుఁజిత్రముగాఁగఁదన్వులన్ ।
జొక్కఁగఁజేయుశాలితతిసొంపుగమల్లెసెలంగుచుండఁగా ।
జక్కనిచక్రవాకములసంతతులెల్లెడబాఱుదీఱఁగా ।
నొక్కటుమోదకారియగునొప్పెహిమానిదినంబులీగతిన్॥ ౧౧౯.

## శిశిరర్తువర్ణనము.

చ॥ పెరిగినశాలియుంజెఱకుఁబెల్లుగనిండిధరిత్రియొప్పఁగన్ ।
శెరయుచునొండుసొండుఁగడువేడుకఁబల్కుచుఁగోకదంపతుల్ ।
పరిగొనిగండుమీఱఁగనుబాటలగంధులకుంబ్రియంబుగన్ ।
బారిశిశిరాగమంబుదగెఁబొంపిరివోవనియింపుఁగూర్చుచున్॥ ౧౨౦.

ఉ॥ పాయకయొప్పెనత్తతనిభానురుచిప్రచురాగ్నిబద్ధవా ।
తాయనమందిరోదరమునంజితగౌరవధారనవ్యచే ।
లాయతకామినీకటియునంగభవప్రథనైకకేళిసం ।
స్థాయముసేవ్యమైతనరునాయెడసర్వజనాభిరామమై॥ ౧౨౧.

ఉ॥ వెన్నెలపిండుచల్వలనువేడుకఁగూర్పుఘనచందనాదుల ।
భ్యున్నతసౌధదేశతతులుబ్బడగూర్పుచంద్రశీతలా ।
సన్నతగాడుపుందెరలసైపఁగనీవుహిమప్రసారముల్ ।
సన్నుతమైనయత్తఱిన్నృసంతతికిన్రజనీపరంపరన్ ॥ ౧౨౨

చ॥ అలరెడుమంచుపెంజడులనబ్బురపుంజలిముచ్చముంపవె ।
న్నెలబలునిగ్గులన్వడకునెక్కొనఁజేయఁగవెల్లరిక్కపెన్ ।
బలఁగమువక్రలీలలనువారకసౌమ్యులసొంపునింపరా ।
త్రులుప్రజకింతయున్ముదముఁదోఁపఁగనీవుధరిత్రినెల్లెడన్ ॥ ౧౨౩

చ॥ మృగమదవాసనల్వలపులీనెడిపువ్వులు తమ్ములంబులున్ ।
దగఁగొనియాసవావళులతావులనాస్యముచెన్నుమీఱఁబొం ।
దుగనసితాగురుప్రముఖధూపములంబయలందుచున్నగ్రొం ।
బొగలుఱళించుసెజ్జయిలుపోఁడిమిఁజొచ్చెనాకర్తునాధుతోన్ ॥ ౧౨౪

చ॥ సురతసుఖంబులిచ్చగొనిసుందరులొయ్యనసాపరాధులై
చెరుకునుసంశయంబుగొనిపిల్లగఁగంపిలుచున్నకాంతులన్ ।
సరసతఁజూచికర్జమువెసన్దలపోసితదీయమంతువుల్ ।
స్మరణయొనర్పకత్తఱినిమన్మథలీలలఁదేల్తురెంతయున్ ॥ ౧౨౫

చ॥ అతితరకామసంభ్రమమునందుచునిర్దయగాఢసంగమో ।
ద్ధతియువనాయకాళిప్రమదంబునఁగూడఁగదీర్ఘయామినుల్ ।
సతతసుఖప్రదంబులనిచానలుమేనులుచెమ్మగిల్లఁగా ।
గతులనుమందతల్బెరయఁగాఁదరియింతురువేఁగుఁబోకలన్ ॥ ౧౨౬

చ॥ చెలువగుశైకపట్టునకుఁజిక్కనచక్కనిచన్నులొప్పఁగా ।
వలరెడుకుంకుమాంకితములైబలుపయ్యెదలక్కలానఁగా ।
వలువుగమించుపెన్దుఱుమునన్విరిసోగులుచెన్నుమీఱఁగా ।
జెలులుహిమాగమంబొనరఁజేర్చినసొమ్ములెయైమదారతన్ ॥ ౧౨౭

ఉ॥ కేసరరాగపింజరవికీర్ణములౌనులివెచ్చచన్నులన్ ।
భాసురసౌఖ్యసంపదలఁబాల్పడఁజేయుచుబాళిగూర్పఁగా ।
వీసరవోకయొవతలపీడనికౌఁగిలులందుశీతముం ।
బాసిసుఖస్థితిఁజెందుదురుపాయపుఁజక్కనినాయకావళుల్ ॥ ౧౨౮

చ॥ తొలఁకెడువేడ్కలారయువతుల్రతివేళలఁదావియార్పగా ।
డ్పులఁబులకింపఁజేయుచునుబూవిలుకానికురంపుటామికల్ ।
గొలుపుచుఁగామకావళినిగూడినమనోహరలీలరేలమ ।

తులనిడుమద్యపానములఁ దుష్టిఁ జెలంగిరి త్రపేలుచున్ ॥ ౧౨౯.

చ॥ మదమును రాగమున్విడిచి మానినియోర్తు ప్రభాతవేళ స ।
మ్మదమున భర్త కాఁగిఁటను మచ్చికఁ గన్నకుచాగ్రభాగముల్ ।
వొదలఁగఁ జొక్కియున్న మెయిపోఁడిమితోఁ బడకిల్లు వెల్వడెన్ ।
మదనతియోర్తు దాని చెలిమం గని పక్కున నవ్వె నవ్వడిన్ ॥ ౧౩౦.

చ॥ అగురుల ధూపముల్వలపు నార్పఁగ నొప్పెడు కుంతలాగ్రముల్ ।
విగళితపుష్పదామముల వ్రేలుచు శ్రోణితలంబునం బడన్ ।
గగనము నీఁక మధ్యమొగిఁ గ్రాలఁగఁ దూరుపు తెల్లవారినన్ ।
మగువయొకర్తుకన్ దా శయనమందిరము న్విడనాడెఁ దిగ్గునన్ ॥ ౧౩౧.

చ॥ పులుదుమువంగ మించుబలుపొన్నలెనున్న మెఱుంగు మేనులున్ ।
గొలుకుల క్రేవఁ గెంపు చవి కుబ్బుచు వీనుల నానుకన్నులున్ ।
గలిగి నిశావసానములఁ గాంతలు గేహములందుఁ గ్రాలిర ।
జ్జలజనివాసినీ క్రమతఁ జారువిలాసము లేర్పరించుచున్ ॥ ౧౩౨.

చ॥ పిఱుదులు గబ్బిగుబ్బలును జెంపును జెందికరంబు వ్రేఁకలన్ ।
బురికొలుపంగ సన్నఁబవముం గనికానులు దైన్యముందఁగా ।
గరితలు మెల్ల మెల్లగను గంపిలుచున్ రతిఖిన్నవేషముల్ ।
దొరఁగిరి నానుకూలముగఁ దోఁగయి సేసిరి నేర్పులారఁగన్ ॥ ౧౩౩.

చ॥ కులుకుచనుంగవన్నఖరకోటుల నొక్కులఁ గాంచి వేడ్కఁ జె ।
న్నలరెడు మోవికెంజిగురులందున పల్గొనగంట్లు వ్రేళులన్ ।
గలయఁ దెమల్చి వాంఛితసుఖంబుల పొందిక సంతసించుచున్ ।
జెలువలలంకరింపు మరుచెన్నగు మోము లహర్ముఖంబులన్ ॥ ౧౩౪.

చ॥ పొలుపుగఁ బంచదారల చవుల్ గులికించెడు నించుదోఁటలున్ ।
వలపుల వింటివాని గొరవంకరొదల్ పొడమించు చెట్టుముల్ ।
జెలువురఁ బానియున్నయెడఁ జేడెలకుంబరితాపకారినై ।
యలవడ వేడ్కఁ గూర్చు శిశిరాగమమెంతయు మేలొసంగదే ॥ ౧౩౫.

❋ వసంతర్తువర్ణనము. ❋

చ॥ వినిచితినమావికొమ్మి స్వరులు వింగడపుంబలు శాఁడిముల్కులై ।
పరిసిలతాంతవీథుల రొదల్ నిగుడం జరియించు తేఁటి పిం ।
డొరపగు నారిదైన వరతోత్సుకులౌ యువకోటి డెందముల్ ।
పరియలు సేయు నామని చెలంగె ధరిత్రిఁ బయోరుహానన నా ॥ ౧౩౬.

చ॥ భ్రమములు పూవుగుత్తులను దోయములింపగు నంబుజంబులన్ ।

కోమలురతోత్సుకంబులను గోమలగంధవహాంబుతావులన్ ।
ప్రమదదమౌదినోత్కరముబల్విడిసౌఖ్యములిచ్చుసంధ్యలై ।
క్రమతవసంతమెంతయునుగంతువతోడనుహాళిఁగూర్చెడున్ ॥ ౧౩౭.

చ॥ నూతులలోనినీరములునూత్నహిమాంబుమిళత్పటీరమున్ ।
శీతమయూఖకాంతులుఁగుశేశయపాణికదంబకంబులున్ ।
జాతమహీజసంతతులుసొంపుగఁబూఁచినపూవుఁదోఁటలున్ ।
ఖ్యాతవసంతవేళనుసుఖావహసంపదఁజెన్నుమీఱెడున్ ॥ ౧౩౮.

చ॥ కుసుమమునద్దినట్టిబలుగోటగునెఱ్ఱనిడాల్డుకూలముల్ ।
మసకములౌపిఱుందులనుమంజులలీలధరించికెంపురం ।
గెసఁగెడివల్పపయ్యెదలువాలఁగఁజన్నులఁగప్పియయ్యెడన్ ।
బిసరుహగంధులామసనుపీడరుచెల్వొరయుండదండలున్ ॥ ౧౩౯.

చ॥ కొమరగుకర్ణదేశములఁగోమనమించెడుకొండగోఁగులున్ ।
విమలవినీలకాంతిఁదగువేనలులందునశోకసూనముల్ ।
క్రమతవికాసముంగనికరంబలరారెడికుందపుష్పముల్ ।
ప్రమదలుదాల్చికాంతలనుభాసురలైచెలువొందిరయ్యెడన్ ॥ ౧౪౦.

చ॥ మలయజసారచర్చలసమంచితమౌచనుదోయిహారముల్ ।
చెలువగుబాహువల్లికలఁజేర్చినసద్వలయాంగదంబులన్ ।
బలువుగడించిమిఁచుకటిభాగములన్మణిమేఖలావళుల్ ।
వలపులతేనికోఁకలనువందురుకాంతలుదాల్తురెంతయున్ ॥ ౧౪౧.

చ॥ రతనములందుముత్తెములురంగుమెసంగఁగఁగూర్చినట్టుగా ।
నతులితలీలనొప్పుకనకాంబురుహంబులబోలుమోములన్ ।
వితతములౌచుఁజెమ్మటలువేమొలువంగఁగరంగిపాఱుయా ।
వతలకపోలపత్రములువారనిమారునిబోరులన్మొగిన్ ॥ ౧౪౨.

ఉ॥ దర్పమెలర్చుదర్పకునుదారశరంబులనొల్లఁబోయిపె ।
న్నార్పులఁదత్తరంబులనునొయ్యననూడినకంచుకంబులన్ ।
దార్పకమందగామినులుత్రిస్తకళావివశీకృతాంగులై ।
యోర్పులుజాఱవేగదగులూనుదురొద్దఁజెలంగునాథులన్ ॥ ౧౪౩.

చ॥ వలపులఁజొక్కియున్నతెలివన్నియమేనులజాడ్యమువ్వోసన్ ।
దొలఁచిపొరింబొరిన్మరుఁడుతోయజబాణకదంబకంబులన్ ।
[illegible]తెంగితత్తగముఁగల్గఁగఁజేసికడానిమించులన్ ।
చెలఁగ[illegible]నాథులచెంతకయ్యెడన్ ॥ ౧౪౪.

చ॥ మదిరలనైర కెంపుచవి మానని కన్నుల లౌల్యసంపదల్ ।
పొదలెడి చన్నులం బిగి కపోలతలంబులఁ బాండిమప్రభల్ ।
కొదువపడంగు కౌనుల నకుంఠితపీనత బల్పిఱుందులన్ ।
గుదురుకొనెం బాలంతులకు గొబ్బున నామని వేళ నబ్రమై ॥ ౧౪౫.
చ॥ తనువులు నిద్రచొక్కులను దత్తరమందుచుఁ దూలుచుండఁగా ।
ననుపగు పల్కులన్మదము నాటుక నేటుగ నింపుఁ గూర్పఁగా ।
గొనబగు చూపులం బొమల కుంచితలీలలు వక్రతల్దగన్ ।
బరుపడఁజేసె మన్మథుఁడు భామల కయ్యదనంబెడంగుగన్ ॥ ౧౪౬.
ఉ॥ పొంకములైన పొన్బనఁటి పోఁడుములం జెలువారు చన్నులన్ ।
దుంకువమైఁ బ్రియంగువును నొప్పగు జాయక కేసరంబులున్ ।
సంకుమదంబునుం గలిపి చందనపంకములందిరప్పడే ।
శాంకమనోహరాస్యలు రయంబున నాథులఁ గూడు వేళలన్ ॥ ౧౪౭.
చ॥ మదనమదాతిరేకముల మాటికి మానినులొయ్యనయ్యెడన్ ।
ముదుగగు చేలముల్విడిచి మొల్లపు దాసనపూవురంగులన్ ।
గదురు నలంతి యొల్లియలఁ గాయములం దొడి కేళపాళినిం ।
పొదలెడి సంబరేణుపొగలుం చిరితావులు గుబ్బతిల్లఁగన్ ॥ ౧౪౮.
చ॥ లలితరసాలబాలకిసలంబుల మేసి కడింది మత్తునన్ ।
గొలకొలఁ బల్కుచుండు మగకోయిల చుంబనకేళి నాడుఁగో ।
యిలనలరించెఁ బెన్రొదల భృంగము నీరజసన్మరందమున్ ।
దలర నిజప్రియాళికిడి తన్పెను పీసరవోని చెల్మితోన్ ॥ ౧౪౯.
ఉ॥ కెంజిగురాకుజొంపములఁ గ్రీమొగమై పొరివేవ్రిలు రెమ్మలన్ ।
రంజిలు మావులున్మడిభరంబుగఁ బూఁచిన కొమ్మకూటువున్ ।
మంజులవాతపోతములు మాటికినూచుచుఁ గామినీమనః ।
కంజములుత్సుకంబుగొనఁ గానొనరించెఁ గరంబు దేఁకువన్ ॥ ౧౫౦.
ఉ॥ ఎల్లెడ విద్రుమచ్ఛవులనీనుచుఁ దామ్రరుచిం జెలంగుచున్ ।
బల్లవపుష్పగుచ్ఛముల భాసురసంపద చేనశోకముల్ ।
జల్లనియుల్లముల్గలఁచి సారెకు శోకముఁ బొందఁజేసెను ।
ఫుల్లసరోజలోచనలఁ దూరెఁగు మన్మథసాయకంబులై ॥ ౧౫౧.
ఉ॥ పోఁడిమిఁ జేఁటిదాఁటులకుఁ బొందుగ విందులు వెట్టు పూవులన్ ।
గాడుపు రేఁచి వన్గదలి కంబొరిన భ్రమము లౌచి వుల్లులన్ ।
వీడక కాముకావళికి విభ్రమముల్ సమకూర్చు చెంతయున్ ।

జూడఁగ సొంపు నింపు నవచూతలతల్ పెలఁగెన్ విచిత్రమై॥ ౧౫౨.

చ॥ సిరిగలకాంత మోముచవి సేవయొనర్చుచు శోభనవ్యతా ।
కురవకపుష్పమంజరులకోమలతన్ దిలకించె నేనియే ।
నరుణకుఁదోనసుత్సుకము నాఁటును డెందమునందుచూరుకోర్కి ।
వ్యతికఱకారుతూపు లెదవ్రీలఁగఁ జేయవు కామినీమణీ॥ ౧౫౩.

ఉ॥ మండెడునిష్ఠ వేఁడిమి సమంబయి వీఁచెడుమారుతంబుచే ।
నిండఁగఁ బూఁచి యేఁపుగను నేలకు వ్రాలినకింశుకాలిచే ।
మెండుగఁ గెంపు రాల్చుడుగ మేలగు నొల్లలియఁ దాల్చు కొమ్మయు ।
ప్లిండె ధరిత్రియామని మహోన్నతిఁ జెన్నలరారుచుండఁగన్॥ ౧౫౪.

చ॥ చిలుకలముక్కుచాయలను జెల్వగు మోదుగులింత యేనియున్ ।
గలపవుకొండఁగోఁగు మదిఁగందఁగఁ జేయమిగాని కొంతలం ।
దెలయాఁగఁజిత్తవృత్తులను నేఁకటు నిల్పినదారిఁ డెందముల్ ।
కొలకొలఁగూయుకోకిలలకూఁకలు వేగబగిల్చె నాకటన్॥ ౧౫౫

చ॥ ఫలరసమానిమత్తియయి భంగురతన్ గలకూజితంబులన్ ।
జెలఁగుపికావళిన్ మదముచే రొదఁ జేసెడుషట్పదంబులన్ ।
గలకలు లేని సిగ్గులను గందువలౌ వినయంబుల న్వెసన్ ।
దొలఁచి నెలంతలాకులముతో నవశాత్మకులైరి నివ్వెఱన్॥ ౧౫౬.

చ॥ సరసముగాఁగఁ బూఁచినరసాలములందున లంతితెమ్మెరన్ ।
బరిచలితంబులై నవపల్లవగుచ్ఛములన్వసించియు ।
బ్బురమొదవంగఁ గోవెలలు పోతరపున్ రొదలాచరింపఁగా ।
సురుచిరమావసంతము నసొమ్ముఁగొనెన్ యువకోటిడెందముల్॥ ౧౫౭.

చ॥ సుదతులనవ్వుసంపదలఁ జాఱలు గాఁగొను మల్లెమొగ్గల
య్యదను నవేడ్కతోఁ టలము దావహమై పొడసూపమాని హృ
త్సదనములైర రాగసతతంబులు గాముచు రాగయుక్తులై ।
పొదలెడి మాయపుంజములఁ బుద్ధులు నిక్కకచొక్కనుండునే॥ ౧౫౮.

చ॥ కటులను లంబమేఖలలు గబ్బిచనుంగవ లంబహారముల్ ।
పటుతరమన్మథాస్త్రపరిబాధితకోమలగాత్రవల్లులున్ ।
దటుకునఁ దాల్చి యమ్మధువు దారొక్కనఁ గోయిలలట్టు పల్కన ।
కుటిలశిరోజలు మ్మడిని గోల్కొని రొక్కటఁ గాంథచిత్తముల్॥ ౧౫౯.

చ॥ బహ[illegible]విధమంజులప్రసవబంధురభూషితభూరుహాంతముల్ ।
కుహుకుహునాదకారిమదకోకిలసంకులసానుభాగముల్ ।

మహితశిలాకలాపరుచిమానితమైతగుగండశైలముల్ ।
మహీధరముల్పొడగనినమానవకోటికిమోదమిచ్చెడున్ ॥ ౧౬౦.

ఉ॥ పడఁతుకఁబాసిచాలఁగనువందురిమానసమొల్లఁబోవఁగా ।
నడవినిబుష్పమంజరులనభ్రమగందగుతియ్యమావులన్ ।
బాడఁగనికన్నుఁదోయినఱమోడుచునీరొగినించుభీతునం ।
బిడికిటఁబ్రాణమంచువిలపించునాకందువియోగవేదనన్ ॥ ౧౬౧.

ఉ॥ తతగతిఁబల్కుచుంబరభృతమ్ములుజొమ్మనిమ్రోయుతేఁటుల ।
ద్భుతముగఁబూఁచుమావులునుబుష్పమనోహరకర్ణికారముల్ ।
రతిపతియేపులన్సగియురామలమానసవీథులన్మ్రగిన్ ।
నీతశరజాలమట్లువెతఁజెందఁగఁజేసెనుమాధవంబునన్ ॥ ౧౬౨.

ఉ॥ శరములుమావిక్రొవ్విరులుచాపముకింశుకజాలమోలిబం ।
భరములునారినిర్మలవిపాండురచంద్రుఁడెవెల్లగొల్లి బల్ ।
కరువలియామఱేనుఁగుపికంబులువందులుగాఁగలోకజి ।
త్త్వరుచుఘుఁగూడిమన్మథుఁడువారక భద్రములిచ్చెనెల్లెడన్ ॥ ౧౬౩.

చ॥ చెవులకునింపులౌమధుపశేఖరమంజులగీతికావళుల్ ।
దవిలినయామనుపెంపుననుదాత్తములౌపికపాళికూఁకలున్ ।
బువులనుగ్రోలుమామిడులఁబోఁడిమిద్రిమ్మరుపిన్నతెమ్మెరల్ ।
నెవులొడగూర్చెనయ్యదననీరజనేత్రలమానసంబులన్ ॥ ౧౬౪.

చ॥ పసవపుసంజయొప్పెసఁగెఁబ్రస్ఫుటకౌముదికాభిజాత్యమై ।
పరభృతరావయుక్తమయిభవ్యసుగంధముదానిలంబునై ।
వరమధుపానజృంభదురుబంభరనాదసుగుంభనంబునై ।
సరసగతిన్రతీశ్వరరసాయనమౌచువసంతసంగతిన్ ॥ ౧౬౫.

చ॥ సరగుననుత్సహింత్రుదివసంబులకట్టనఁజెట్లనీడలన్ ।
గరువపురేలనప్పగిదిఁగాంక్షయొనర్తురుపండువెన్నెలం ।
శరిమనుబవ్వడింత్రుతెలిమేడలపైవిరిసెజ్జలందొగిన్ ।
గురుతొనుకొమ్మకౌఁగిలులఁగోరుదురందఱుశీతవేళ్చలన్ ॥ ౧౬౬.

చ॥ కళుకుకడానిడాల్దొరఁగికమ్మనితావులపూవుగుత్తులన్ ।
జెలఁగుచుఁబిన్నగాలిభ్రమజెందుచుఁగ్రొన్ననలెత్తుమావులన్ ।
గలయఁగఁజూడఁద్రొవనరికట్టిమరుండుశరంబులేయఁగా ।
వెలవెలనైప్రవాసిమెయివీసరవోవఁగవ్రాలెధారుణిన్ ॥ ౧౬౭.

చ॥ ఎలమిఁజెలంగుకోయిలలయెల్గులుమేలపుపల్కులైతగన్ ।

పు.సా.(లిఖిత రచయిత)
అని-3 ౫-13 ఋ.తు.వి.లా.స.ము.

సోలపగుకుండకట్లలరుచుల్ నగుపల్లవులైతొలంకఁగా ।
లలిచివురాకుసొంపులువిలాసపుఁజేతులసన్నగాఁగనే ।
ర్పొలయువసంతుఁడంగనలనూరకనవ్వినయట్లుతోఁచెడిన్ ॥ ౧౬౮

చ॥ కనకపునిగ్గులందెగడుగండతలంబులకాంతిచేతనిం ।
పనుపడంగగంధములహారములందగుగుబ్బపాళిచే ।
ననుపగుమత్తులన్విలసనంబులమించెడుచూపుడాలుచే ।
వనితలుశాంతులైనమునివర్యులకేఁబొడమింత్రుమోహముల్ ॥ ౧౬౯

ఉ॥ లొద్దుగచాయలన్మెఱయులోచనముల్మధువాసనాస్యముల్ ।
గద్దరితావులీన్గురవకంబులఁగ్రాలెడుకేశపాశముల్ ।
పెద్దయురద్దులౌచనులుపీనములైతగుశ్రోణిబింబముల్ ।
దిద్దినయట్లక్రాలునెలలేమలతోమరుఁడేఁచుఁబాంథులన్ ॥ ౧౭౦

ఉ॥ గందపుఁగొండగాడ్పులనుగైకొనికోయిలగుంపుగూడినిం ।
వ్యాందమరందబిందువులయందలికమ్మనితావులూనిపెం ।
పొందమిళిందబృందములనొక్కటనెల్లెడనిండఁజేసితా ।
నెందువసంతుఁడిచ్చుకదయెల్లరకుంబ్రమదంబుసౌఖ్యమున్ ॥ ౧౭౧

---

క॥ అనియిటులకాళిదాసుం । డనువుగవాక్రుచ్చినట్టియదిరసికులకున్ ।
మనమునకింపుఘటింపఁగ । దెనుఁగునఁగావించినాఁడధీరులుగొనుఁడీ॥ ౧౭౨

క॥ శ్రీమన్నిర్మలకరుణా । స్థేమాయతసత్కటాక్ష శ్రీయుతవక్షా ॥
కోమలరుక్పదనలినా । కామబహుళఃజయనిపుణకాయవిలసనా॥ ౧౭౩

గద్యము॥ ఇదిశ్రీహయగ్రీవపదారవిందమకరందపూరిత మనఃపాత్ర యదుశైల మాహాత్మ్యాదికగ్రంథరచనాకౌశలవాగ్విచిత్ర కౌశికసద్గోత్రశ్రీవీరరాఘవార్యపుత్ర సరసకవివర్య శ్రీనివాసార్య ప్రణీతంబైన ఋతువిలాసము సర్వంబునేకాశ్వాసము.

---

చ॥ అసమహయాననాంఘ్రిజలజాంతరమత్తమిళిందుఁడున్ సుధీ । విసరవిధే
యుఁడున్సరసవిస్ఫుటవాగ్మియుఁగౌశికాన్వయా । గ్రసరుఁడు శ్రీనివాసకవిరంగుగ
దీని రచించెనిక్కలిన్ । రసనిధిరత్నవార్ధిసమరంజిలి సత్కవులాదరింపఁగన్ ॥

---